# ప్రగతి రథం

విజయలక్ష్మి పబ్లికేషన్స్ ప్రచురణ నెం. **19**

ప్రథమ ముద్రణ : 2001

వెల : రూ॥ 10-00

ముద్రణ :

విష్ణు గ్రాఫిక్స్, సిరిసిల్ల.
ఫోన్ : 32414.

ప్రతులకు :

**★రేగులపాటి కిషన్‌రావు**
జి.ప. సెకండరీ పాఠశాల, ఇల్లంతకుంట.
జిల్లా : కరీంనగర్ - ఆం.ప్ర.

**★కవితా ఆనందరావు**
కవితా నిలయం
ఇంటి నెం. 10-1-216,
సంతోష్‌నగర్, కరీంనగర్ (ఆం.ప్ర.)



**నిహిత్ కుమార్** **నిఖిల**

ముత్యాల మూటలనీ
అంటాము మిమ్మల్నీ
రత్నాల రాసులనీ
అంటాము మిమ్మల్నీ
మా ఇంటి దివ్వెలనీ
అంటాము మిమ్మల్నీ
మా కంటి వెలుగులనీ
అంటాము మిమ్మల్నీ

విద్యలనూ విలువలనూ
పెంచుకోండి మీరు
ముందు ముందు ముందిలోన
వెలిగిపోండి మీరు
అక్షరాల 'ప్రగతి రథం'
పుచ్చుకోండి మీరు
మురిపాలను దాచుకోక
ఇచ్చుకోండి మీరు.

మీ
**తాతయ్య**

# సమతకు దండం
# సుమతికి దండం

మంచికి దండం పెడుతా
మమతకు దండం పెడుతా
మంచి, మమత ఉన్న మనిషి
మనసుకు దండం పెడుతా.

భాషకు దండం పెడుతా
మాటకు దండం పెడుతా
మాటలు పంచే చక్కని
వక్తకు దండం పెడుతా.

నీతికి దండం పెడుతా
విద్యకు దండం పెడుతా
నీతి విద్య నిండియున్న
నరునికి దండం పెడుతా.

సమతకు దండం పెడుతా
నియతికి దండం పెడుతా
సమత నియతి పాటించే
సుమతికి దండం పెడుతా.

# మమతలలో మల్లెలం

మమతలలో మల్లెలం
మృదువులొలుకు మొగ్గలం
మధురమైన నవ్వులం
మురిపించే పిల్లలం.

పలుకులలో చిలుకలం
పరుగుతీయు జింకలం
ఎగిరిపోవు పిట్టలం
ఎదుగుతున్న పిల్లలం.

పెరుగుతున్న మొక్కలం
వెలుగు పంచు చుక్కలం
మ్రోగుచుండు మువ్వలం
పాడుచుండు పిల్లలం.

ఆటలతో చదువులతో
అలరించే పిల్లలం
సంబరాలు అంబరాన
చిందించే పిల్లలం.

# ప్రగతి రథం

గణతంత్రదినం నేడు వచ్చింది
ప్రగతిరథం తాను నడుపవచ్చింది ॥గణ॥

జనవనరులు జల వనరులు
వనవనరులు గని వనరులు
భూదేవత చేతులలో
పరిమళించు వనరులతో
సమన్వయం చేయుటకై
ప్రగతి పెంచు యోజనకై ॥గణ॥

పరుగులెత్తు నది కన్యల
పరుగులాపి నిలుపుటకై
నిలిపి చెరువు గద్దియపై
నృత్యము చేయించుటకై

ధాన్యలక్ష్మి భాగ్యలక్ష్మి
చెంతచేరి దీవించగ
కర్షకజన సమూహాలు
హర్షము ప్రకటించుచుండ ॥గణ॥

జనవనరుల వనవనరుల
సమతౌల్యం కాచుటకై
పెరిగిపోవు జనులకెప్పుడు
వనవనరులు నిలుపుటకై
పథక రచన చేయుటకై
ప్రతిభ తాను చూపుటకై ॥గణ॥

చక్కని పథకాలు వేసి
చిక్కని ఖనిజాలు తీసి
ఖనిజాలతో వస్తుచయము
చేయునేర్పుపెంచుటకై
జాతి జనుల అవసరాలు
తీర్చి మెప్పుపొందుటకై ॥గణ॥

పదార్థాలు దొరుకుచోట
ప్రగతిపెంచగలుగు చోట
జనం కోరు వస్తుగణం
ఉత్పాదన పెంచుటకై

జనుల అవసరాలు తీర్చి
జగతి మెప్పుపొందుటకై
జనవనరులు నియంత్రించి
జనుల బ్రతుకు పెంచుటకై ॥గణ॥

దేశములో రవాణాది
ఘనవసతులు పెంచుటకై
పదార్థాలు రవాణించి
అవసరాలు తీర్చుటకై
ప్రజాస్వామ్య పద్ధతిలో
ప్రజలు ప్రయాణించుటకై
స్నేహాలను పెంచుకొనుచు
ఘన ఐక్యత కూర్చుటకై
దేశమాత రక్షణకై
జనుల సిద్ధ పరచుటకై ॥గణ॥

ప్రజల కొరకు ప్రగతి కొరకు
స్వేచ్ఛ కొరకు జనం కొరకు
సమత మమత లక్ష్యాలను
సాధించే నేర్పు కొరకు
ప్రజాస్వామ్య పాలనతో
ప్రజాభీష్ట సిద్ధి కొరకు ॥గణ॥

గణతంత్రదినం నేడు వచ్చింది
ప్రగతి రథం తాను నడుపవచ్చింది.

# జనం పెరిగిపోతే

అను నిత్యం జనం పెరిగిపోతే
సంక్షేమం ఎలా కలుగు
సౌజన్యం ఎలా పెరుగు
సిరి సంపద శాంతి సుఖము
సుస్థిరమై ఎలా నిలుచు
ప్రగతి కోరు సుజనులార!
యోచించండి!
చక్కనైన ఆలోచన సాగించండి.

అనునిత్యం జనం పెరిగిపోతే
దండి పంట పండించిన
తిండి కరువు తీరకుండు
నీడ ఎంత పెంచిననూ
నిలువ నీడ దొరకకుండు
గుడ్డలెన్ని నేసిననూ
అవసరాలు తీరకుండు
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
చిరుజల్లులు కురిపించుచు
ఫల పత్రములందించుచు
సొగసులొలుకు వృక్ష సతులు
నేలమీద నిలిచేనా
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
తాగునీరు సాగునీరు
అందచేసి సాగిపోవు
అందమైన సెలయేరులు
అంగలేస్తు సాగేనా
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
కనిపించక తన ఉనికిని
కనువిందుగ తెలుపుగాలి
కష్టలమై కుమిలి కుమిలి
కంపించక మానేనా ?
ప్రళయం కల్పించక మానేనా ?
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
అక్షరజ్ఞానమ్ము పెంచు
వనరులిన్ని చాలేనా ?

పేదరికం పెరుగకుండ
ఆపివేయగలిగేమా ?
పెంచలేని వనరులతో
ఉపాధి పెంచగలిగేమా ?
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
పరిమిత సంతానమే
మనకు నేడు హితమనీ
నిజం తెలుసుకోవాలీ
నమ్మి నడుచుకోవాలీ
అదే మాట పదే పదే
జనం మనం దినం దినం
మాటలాడు కోవాలీ
పాట పాడుకోవాలీ
అనునిత్యం జనం పెరిగిపోతే

అనునిత్యం జనం పెరిగిపోతే
ఉన్నజనులు ఉన్నతముగ
జీవిస్తారా? ఉన్నతినీ
ఉచితముగా సాధిస్తారా ?
శుభం కోరు సుజనులార !
యోచించండీ !
ప్రగతి కూర్చు ఆలోచన
సాగించండీ.

# ఏది గొప్ప ?

నీ కులము గొప్పదని
విర్రవీగెదవేమి ?
కులమంటె ఏమిటో చెప్పరా
కులము ఘనతేమిటో చెప్పరా

పడతి పురుషుడు సంగమించగ
గర్భధారణ సంభవించి
శిశువు జననం జరుగుచుండును.
తెలుసు తెలుసని తెలుసునా ?

జనన మొందిన శిశువులందరు
పాలు త్రాగే బ్రతుకుచుందురు
తల్లి ఇచ్చే పాల రంగు
తెలుపు తెలుపని తెలుసునా ?

మనిషిలో ప్రవహించు రక్తం
మనిషినే నడిపించగలుగును
మనిషినే నడిపంచు రక్తం
రంగు ఎరుపని తెలుసునా ?

మనుజులందరు నిలిచియున్న
నేల తల్లి కులము ఏమిటి?
సర్వ జనులు త్రాగుచుండెడి
నీరు కులమది ఏదొ చెప్పుము ?
మనిషి మనిషీ పీల్చి బ్రతికే
గాలి కులమది ఏదొ చెప్పుము ?

నరులు అందరు ఆరగించెడి
తిండి కులమది ఏదొ చెప్పుము ?
జనులు నిజముగ తొడుగు చుండెడి
బట్ట కులమది ఏదొ చెప్పుము ?
మనుజజాతికి నీడ పంచే
ఇంటి కులమది ఏదొ చెప్పుము ?
నడచునప్పుడు మనిషి తొడిగే
పాదరక్షల కులము ఏమిటి ?
చెప్పరా చెప్పరా చెప్పరా.

నువ్వు చచ్చిన పిదప
కట్టెల్లొ పెడుతారు
చమురు నీపై చల్లి
మంటలే పెడుతారు
మంటలతో నీ శవం
తగులనే పెడుతారు
కాలిపోయే కట్టె కులమేమిటి ?
నిన్ను కాల్చే నిప్పు కులమేమిటి ?
నా కులము గొప్పదని
విర్రవీగే మనిషి
చెప్పరా చెప్పరా చెప్పరా.

సమతగొప్పది మమత గొప్పది
నీతి గొప్పది నియతి గొప్పది
మనిషి మనిషిగ బ్రతక నేర్పిన
మనిషి గొప్పని చెప్పరా
మనసుఉండిన మమతనిండిన
మనిషి గొప్పని చెప్పరా
మనసు గొప్పని చెప్పరా.

# పరిశుభ్రత - పచ్చదనము

పరిశుభ్రత పరిమళాలు
పంచవలయు మనమే
పరిసరాల జిగిసొగసులు
పెంచవలయు మనమే
పల్లవించు పలుమొక్కలు
పంచవలయు మనమే
ఫలియించే వృక్షాలను
పెంచవలయు మనమే ॥

వీధులలో చేరి పోవు
మురికి, చెత్త తీసివేసి
పనికిరాని మొక్కలనూ
పెరికి వేసి పెంట వేసి
హాని చేయు క్రిమిజాతుల
నివాసాలు రూపుమాపి
గాలినీటి పరిశుభ్రత
పెంచ వలయు మనమే
వాడిపోని అందాలను
పంచవలయు మనమే ॥

రోగాలను అదుపుచేసి
ఆరోగ్యం వృద్ధిచేసి
పల్లెలనూ చక్కనైన
చుక్కలవలె తీర్చిదిద్ది
పట్టణాలు భూలోకపు
స్వర్గాలుగ మార్చివేసి
వెలిగిపోవు పరిశుభ్రత
పంచవలయు మనమే
పరిమళించు పచ్చదనము
పెంచవలయు మనమే ॥

పరిసరాల అందాలను
సొగసులతో వృద్ధిచేసి
ఫలియించే వృక్షాలను
ప్రతిభ చూపి పెంపుజేసి
పూలు పండ్లు పరిమళాలు
పొందవలయు మనమే
అంతులేని ఆనందం
పంచవలయు మనమే
అందరమూ ఆనందం
పొందవలయు మనమే ॥

# కదిలింది కదిలింది మేఘం

కదిలింది కదిలింది మేఘం
కంపించి కదిలింది మేఘం
గాలి చెలికానితో
గగన ఘనవీధిలో
ఉరుముతూ ఊగుతూ
ఊపిర్లు వదులుతూ
సూర్య కాంతిని మించు
మెరుపులను రువ్వుతూ
కదిలింది కదిలింది మేఘం
కంపించి కదిలింది మేఘం.

వృక్షాలు తన ఆప్త
మిత్రులని తెలుపుతూ
కొండలే తన ఆట
స్థలములని తెలుపుతూ
గాలి చెలికానితో
గంతులే వేయుచూ
కదిలింది కదిలింది మేఘం
కరుణతో కదిలింది మేఘం

వరహాల వర్షాలు
జలజలా కురిపించి
కర్షకుల హృదయాలు
హర్షముతో పండించి
మనసార మనుజులకు
మురిపాలు అందించి
కదిలింది కదిలింది మేఘం
కరుగుతూ కదిలింది మేఘం.

చిక్కిపోయిన తనదు
సెలయేటి జవరాలి
చిక్కులన్నీ తీర్చి
చింతలను బాపుటకు
జలరాశి హస్తముతో
జవరాలి కన్నీరు
తుడిచి సంబరపెట్టి
తిరిగి వచ్చెదనంటు
కదిలింది కదిలింది మేఘం
కవ్వించి కదిలింది మేఘం.

తాను రాల్చిన జల్లు
పుడమిపై ఉరుకంగ
జలధారలే కలసి
జలపాతమై పొర్లి
చెరువులే నిండంగ
నురుగులై పొంగంగ
గట్ల మీది చెట్లు
గలగలా నవ్వంగ
కదిలింది కదిలింది మేఘం
గర్జించి కదిలింది మేఘం.

పచ్చగడ్డి చూచి పశువులే ఉరుకంగ
నింగిలో పక్షులూ పల్టీలు కొట్టంగ
సస్యాలు పండించి ధాన్య రాసులు నింపి
పిల్లపెద్దలు కలసి పర్వంగ గడుపంగ
కదిలింది కదిలింది మేఘం
నవ్వించి కదిలింది మేఘం.

# గాయకమణి బాలు

ఘనుడవీవు ఘనుడవీవు
ఘనుడవీవు బాలూ !
అభినందన రత్నరాసు
లందుకొనుము బాలూ !

ఉన్న ప్రతిభ ఉన్నతంగ
పెంచుకొన్న బాలూ!
ఉన్నతులలో ఉన్నతునిగ
నిలిచియున్న బాలూ!

గళము నిండ సుధానిధులు
నిలుపు కొన్న బాలూ !
గళము విప్పి గానసుధలు
పంచుచున్న బాలూ !

గానములో గంధర్వులు
ఘనులనగా వినుచుంటిమి
గానము నీవలె పంచిన
గంధర్వుని కనకుంటిమి.

కవి ప్రతిభకు గాన ప్రతిభ
జోడు చేసి పాడి పాడి
పాట ప్రతిభ పెంచినావు
పరవశింప జేసినావు.

స్వరపండిత మండలినే
అబ్బుర పరచినవాడా !
స్థిర కీర్తిని ఆర్జించిన
గాయక ఘనపండితుడా!

పలు భాషల చిత్రాలలో
పాట పాడి మెప్పించిన
పలుకు నీది ప్రతిభ నీది
పసందైన చరితనీది.

మధువులూరే నీదు పాటలు
మాటిమాటికి వినుచునుంటిమి
మనసునిండుగ ముదము నింపే
మేటి పాటలు పాడుమంటిమి.

# ఆటలాడు సోదరులారా !

రండి రండి సోదరులారా !
ఆటలాడు సోదరులారా !

ఆటలలో నైపుణ్యం
ప్రయోగించి ప్రదర్శించి
ఆటల మైదానములో
ఆనందం తాండవించ
ఆటలాడి ఆటలాడి
ఆట ఘనత చాటుదాం ॥రండి॥

ఆటలే అణువణువున
ఆరోగ్యం పెంచుచుండు
ఆటలే మరువలేని
చెలిమినెపుడు పెంచుచుండు
ఆటలాడి అంతులేని
ఆనందం పంచుదాం ॥రండి॥

సమత మమత పంచగలుగు
మానవతను పెంచగలుగు
అసమానత చీకట్లను
అంతరింప చేయగలుగు
ఆట మాట వెలుగులనూ
అందరికీ పంచుదాం ॥రండి॥

విశ్వవ్యాప్త నరజాతిని
కలుపగలుగు శక్తిగలవి
విశ్వప్రేమ శాంతి కాంతి
కలుగజేయు యుక్తిగలవి
ఆటలే ఆటలూ
ఆటలే ఆడుదాం ॥రండి॥

# ఆటలు

ఆటలు ఆటలు ఆటలురా
అవి ఓటమి గెలుపుల ఆటలురా
ఆడి ఓడినా ఓడిగెలిచినా
ఆటల లక్ష్యం గెలుపేరా

ఆటలు ఆటలు ఆటలురా
అవి ఆరోగ్యానికి బాటలురా
అందరు మెచ్చగ ఆటలు ఆడుచు
ఆటల ఘనతను చాటుమురా.

ఆటలు ఆటలు ఆటలురా
అవి చెలిమిని పెంచే మాటలురా
చెలిమిని మించిన సంపద లేదని
చెలిమిని పెంచగ ఆడుమురా.

ఆటలు ఆటలు ఆటలురా
అవి ఆనందానికి ఊటలురా
అంబరమంటే సంబరాలతో
ఆడుచు విజయం పొందుమురా.

# మీహితమును కోరుచుందు

స్నేహితులారా! ఓ హితులారా!
చెలిమి కలిమి కన్న మిన్న
ఏమున్నది ఇలలోపల
స్నేహదీప్తి కన్న మిన్న
వెలుగుందా జీవితాన ॥స్నేహి॥

శుభం మీకు శుభంబనుచు
శుభ కామన తెలుపుచుంటి
జయం మీకు కలుగాలని
మనసారగ కోరుచుంటి ॥స్నేహి॥

అనురాగం ఆత్మీయత
సమభావం సౌజన్యము
పంచి చెలిమి పెంచుచున్న
స్నేహితులారా! ఓ హితులారా! ॥స్నేహి॥

పలుకులలో సుధలు నింపి
సహకారం సదాపంచి
స్నేహ బలం పెంచుచున్న
స్నేహితులారా ! ఓ హితులారా!! ॥స్నే॥

మననెయ్యము నిర్మలమై
సురఝరిలా సాగాలని
మనమనసులు సంబరాల
సాగరమై నిలువాలని
కోరుదాం కోరుదాం కోరుదాం. ॥స్నే॥

# సమతా మమతలు

మంచిని పెంచే మతాల మహిమను
మనసులు విప్పి ప్రకటిద్దాం
కులాల ఇజాల మర్మం తెలిపి
కూరిమి పెంచగ ఆశిద్దాం.

భాషను పెంచి పలుకులు పంచి
భావం స్వేచ్ఛగ అందిద్దాం
విద్యలు వృత్తులు చక్కగ నేర్పి
వికాస స్థాయిని పెంచేద్దాం.

విలువలు చేర్చి కళలను పెంచే
సృజనా ప్రతిభకు విలువిద్దాం
చెలిమిని పంచి కలిమిని పెంచి
చక్కని సంస్కృతి నిర్మిద్దాం.

సిరిసంపత్తుల పంపకాలలో
సతతం నీతిని పాటిద్దాం
చట్టబద్ధముగ పాలన జరిపి
సమతా మమతలు సాధిద్దాం.

# మన జెండా ఎగరేద్దాం

స్వాతంత్ర్య దినము నేడు వచ్చింది
మనం మెచ్చు మంచి రోజు వచ్చింది
మహాత్ముల త్యాగఫలం వచ్చింది
మురిపాలను మూటగట్టి తెచ్చింది.

ఆంగ్లేయుల పరిపాలన
పరిపాలన కాదంటిమి
తెల్లదొరలు దొరలుకాదు
గజదొంగలు వారంటిమి.

అజ్ఞానిచేత పరిపాలన
తగదంటిమి వలదంటిమి
స్వేచ్ఛలేని పరిపాలన
వలదు వలదు పొమ్మంటిమి
బానిసలుగ మనుటకంటె
చావే మరి నయమంటిమి.

చెరసాలలో బంధించిన
చిచ్చుగుణము ప్రకటిస్తిమి
స్వేచ్ఛకోరి స్వేచ్ఛకొరకు
పోరు మనము సాగిస్తిమి
అలుపోని పోరు చేసి
స్వాతంత్ర్యము సాధిస్తిమి.

శాంతిని కోరేవాళ్లం
స్వేచ్ఛగ బ్రతికే వాళ్లం
పని సంస్కృతి కలవాళ్లం
పచ్చగ బ్రతికే వాళ్లం

ఎవరైనా ఎప్పుడైనా
ఎక్కడైన ఎలాగైన
మననేలను మన స్వేచ్ఛను
కబళించగ యత్నించిన
ఎదిరింతుము ఓడింతుము
ఘనవిజయము సాధింతుము.

చెలిమి చేయ చేరవస్తె
చేయి మనము అందింతుము
హితముకోరు మనహితులకు
హితము కూర్చ యత్నింతుము
మనం మనం కలసి మెలసి
సఖ్యతతో జీవింతుము.

శాంతి కోరి క్రాంతి కోరి
జనం కొరకు స్వేఛ్ఛ కొరకు
నింగి నిండ నింగిలోకి
జయకేతన మెగిరేద్దాం.

జాతి కొరకు నీతి కొరకు
సమత కొరకు మమత కొరకు
మిన్నయైన మనజెండా
మిన్నులంద ఎగరేద్దాం.

స్వాతంత్ర్య దినము నేడు వచ్చింది
గత చరిత్ర గుర్తు చేయ వచ్చింది
మన నేతల త్యాగఫలం వచ్చింది
మురిపెమ్ముల మూట తాను తెచ్చింది.

# ప్రగతి కామన

చుక్కలలో చంద్రుని వలె
ఉండనేను యత్నింతును
మురిపాలను ముచ్చటగా
పాలించగ యత్నింతును.

విశ్వములో ప్రత్యేకత
పొందనేను యత్నింతును.
విశ్వజనుల జిహ్వలపై
విహరించగ యత్నింతును.

కాలమ్మును ప్రాణమువలె
రక్షింపగ యత్నింతును.
కాలమె నా జీవితమని
ప్రకటించగ యత్నింతును.

ఊపిరి ఉన్నంతవరకు
శ్రమచేయగ యత్నింతును.
ప్రతి క్షణము జయకేతన
మెగురవేయ యత్నింతును.

ఖేదాలను రూపుమాపి
మోదాలను కల్పింతును.
మోము మోములో ప్రమోద
ముద్రవేయ యత్నింతును.

# నేను

చెట్టులాగ ఎదిగి నీడ పంచుచుందు నేను
కనువిందగు కుసుమాలను పెంచుచుందు నేను

ప్రాణాలను కాచుగాలి వీచుచుందు నేను
ఫలము లిచ్చి మీ బ్రతుకులు కాచుచుందు నేను

రుచికరమగు ఓగిరమ్మై విందునౌదు నేను
రోగాలను తొలగించెడు మందునౌదునేను

పక్షులకూ ఆశ్రయంబు కల్పింతును నేను
పశుగణమ్ము మీద కరుణ కురిపింతును నేను

పచ్చదనము చల్లదనము తెచ్చుచుందు నేను
పసందైన పరిమళాలు ఇచ్చుచుందు నేను

పరుగు తీయు పవనాలను ఆపుచుందు నేను
ప్రకృతి అందాల నెపుడు నిలుపుచుందునేను

కూలిపోయి మిగిమున నిలిచియుందు నేను
ఆసనమ్మై మిమ్ము మీద నిలుపుచుందు నేను.

# దివ్యతత్త్వము

వేదములా నా వాదన వివరింతును వినిపింతును
వాడిపోని పూలవోలె సత్యాలను పూయింతును.

మృత్తికనై వంగడములకాధారమ్మై నిలుతును.
జీవశక్తినందించుచు వృక్ష తతుల నెదిగింతును.

ఓగిరమ్మై ప్రాణి తతికి బ్రతుకు శక్తినందింతును.
జీవించుచు జీవాలకు జీవితమును అర్పింతును.

అనలమునై జ్వలియించుచు దహనమ్మును కలిగింతును.
ప్రాణుల చైతన్య శక్తి పెరుగు శక్తినందింతును.

వాయువునై కదిలి కదిలి ప్రాణతతిని నడిపింతును
కదలుచుండు ప్రతి ప్రాణికి ప్రాణశక్తి నందింతును.

బిందువునై సింధువునై పుడమిపైన నిలిచి యుందు
ఆవిరినై మేఘమునై వర్షమునై కురియుచుందు.

రకరకాల రూపులతో కదలుచుందు ఎగురుచుందు
రమ్యమైన రంగులతో కదలకుండ నిలిచియుందు

వికసించని ఒక బుద్ధికి నాతత్త్వము బోధపడదు.
బాధెందుకు వాదెందుకు వాదనలా నేనుందును